# ప్రార్థన

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్

ప్రసన్న వదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥

శ్లో॥ దోర్భిర్యుక్తా చతుర్భిః స్ఫటిక మణిమయీామక్ష మాలాందధానా

హస్తేనైకేన పద్మం సితమపి చ శుకం పుస్తకం చాపరేణ ॥

భాసా కుందేందు శంఖ స్ఫటికమణి నిభా భాసమానా సమానా

సామే వాగ్దేవతేయం నివసతువదనే సర్వదా సుప్రసన్నా ॥

శ్లో॥ గురుర్ బ్రహ్మా గురుర్విష్ణుః గురు ర్దేవో మహేశ్వరః

గురుస్సాక్షాత్ పరబ్రహ్మా తస్మైశ్రీ గురవేనమః ॥

శ్లో॥ గుకారాంధకారస్తు- రుకారస్తు తన్నిరోధకృత్

అంధకార వినాశత్వాత్-గురో రిత్యభిధీయతే ॥

శ్లో॥ గురు ర్బంధు రబంధూనాం గురుశ్చక్షు రచక్షుషాం

గురుః పితాచమాతాచ సర్వేషాం న్యాయవర్తినాం ॥

# మనవి

పుదూరు ద్రావిడ సంఘాన్ని హైదరాబాద్‌లో ఏర్పాటు చేసి ఇప్పటికిమూడేళ్ళు నిండినది. ఇంతవఱకు మన సంఘం వనరులు సమకూర్చుటలో సభ్యులను ఒకవేదికపై చేర్చుటలో నిమగ్నమయివున్నది. సంస్థ ఉద్దేశాలను సాధించుటకు చేసిన పనులు తక్కువ.

శ్రీ వజ్ఝల వేంకట సుబ్రహ్మణ్య శర్మగారు వారు రచించిన *ఈశావాస్యోపనిషత్తు* అను వేదాంత గ్రంధాని వివిధ రంగాల్లో ప్రఖ్యాతులైన శ్రీమామిడిపూడి ఆనందగారికి అంకితమివ్వాలని తలంచినారు. ఈ సత్కారాన్ని మన సంఘం ద్వారా మూడవ వార్షికోత్సవ సందర్భంలో నిర్వహించాలని మన కార్యవర్గం నిశ్చయించినారు.

డాక్టరు మామిడిపూడి కృష్ణమూర్తి గారు వ్రాసి ఇచ్చిన శ్రీమామిడి పూడి ఆనందంగారి జీవిత విశేషాలను మరియు వజ్ఝల వేంకట సుబ్రమణ్యశర్మగారి పరిచయం, ఈ గ్రంధానికి అనుబంధంగా సమకూర్చడమైనది. ఈ ముద్రణలో మాకు సహకరించిన, మహాలక్ష్మి గ్రాఫిక్స్‌కు, డా॥ మామిడి పూడి కృష్ణ మూర్తి గారికి, మరియు కవరు పేజి చిత్రమును సమకూర్చిన శ్రీ కొండపల్లి శేషగిరి రావు గారికి కృతజ్ఞతలు.

ఆధ్యాత్మిక వికాసం వల్లనే ఇహలోక సుఖం గట్టిపడుతుందనే విశ్వాసమే ఈమా ప్రయత్నానికి ముఖ్య కారణం. మన పూర్వుల, మనకు మిక్కిలి పాత్రమైన వేధ భాగం అయిన ఈ మంత్రోపనిషత్తును అందరుపఠించి జపించి మనశ్శాంతి పొందగలరు.

ఈ మాతొలి ప్రయత్నాన్ని మన సభ్యులు సద్భావనతో స్వీకరిస్తారని తలస్తూ

విదేయుడు

ఉడాలి రామనాథం

కార్యదర్శి

**7.12-97**

**13**, కృష్ణనగర్,

పెండర్‌గాస్ట్ రోడ్,

సికింద్రాబాద్ - **3**.

# తొలిపలుకు

హిందూ సాంప్రదాయంలో సర్వోన్నతుడు, పరమ పురుషుడు ఈశ్వరుడు సర్వాంతర్యామియై వ్యాపించియున్నాడు. ప్రహ్లాదుడు, తండ్రి హిరణ్యకశిపునితో అన్నమాటలివి.

క॥ ఇందు గలడందులేడని
సందేహమువలదు చక్రి సర్వోపగతుం
డెందెందువెదకి చూచిన
నందందే గలఁడు దానవాగ్రణి కంటెన్.

మరల, బమ్మెర పోతన "ఎవ్వని చే జనించు......."
అని దేవునిఁ గూర్చి అత్యుత్తమ ధోరణిలో వ్రాశారు.

వేదాలసారమున్నూ, ఉపనిషత్తులసారమున్నూ, భగవద్గీతసారమున్నూ, చిక్కనై, చిక్కనై, మానవుని మస్తిష్కములో గూడుకట్టుకొన్ననాడు అద్వైత సారమతనికి అర్థమౌతుంది. కర్మజ్ఞానములను సమతుల్యములుగా చూడ గల్గిన నాడు పరబ్రహ్మము కరతలామలకమౌతుందంటారు.'He that sees unity in the diversity of this universe has achieved realisation.' అట్టి జ్ఞానప్రాప్తి యజ్ఞానులకు దుర్లభము జిజ్ఞాసువులకు సాధ్యము. సద్గుణుఁడగు వాడు దుర్గుణాతీతుఁడై నిర్గుణత్వమును పొందుటకు ప్రయత్నించుచున్నాడు.

'అహం బ్రహ్మాస్మి' అనేదే అన్ని వేదాల ఉపనిషత్తుల సారాంశం. బ్రహ్మతత్వ మెఱుఁగుటయే జీవి యొక్క పరమార్థము.

దేవుడున్నాడా లేడా అనేదికాదు ప్రస్తుత ప్రశ్న. కానీ 'He who does not argue is a bigot; He who cannot, is a fool, He who dare not is a coward" ప్రతి దానినీ తూచి తూచి గ్రహించుటయే బుద్ధి మంతుని లక్షణము.

ఈ గొప్ప భావాలను వ్యక్తము చేయు ''ఈశావాస్యోపనిషత్తు'' అందరికి నందుభాటులో నుంచే ప్రయత్నములో సఫలీకృతుడైన శ్రీ వజ్ఝల సుబ్రమణ్యాశర్మ గారికి మనమెంతో కృతజ్ఞులము.

ఓం శాంతిః శాంతిః శాంతిః

హైదరాబాద్ మామిడిపూడి గోపాల కృష్ణన్

**11.12 .1997**

# శ్రీ మామిడి పూడి ఆనందం గారు

20వ శతాబ్దం రెండవ అర్థ భాగంలో పేరు ప్రఖ్యాతులు గాంచిన పుదూరు ద్రావిడులలో శ్రీ మామిడిపూడి ఆనందం గారు అగ్రశ్రేణికి చెందుతారు. వృత్తి పరంగా, చార్టర్డు ఎకౌంటెంటుగా, వీరు అత్యున్నత శిఖరాలనందు కొన్నారు. అయితే వారిలోని విశిష్టత ఏమిటంటే, తన కాలాన్ని, ప్రయాసను వృత్తి కేగాక అనేక యితర రంగాల వృద్ధికి కూడా వినియోగించారు. ముఖ్యంగా సంగీత, నాట్య, నాటక కళలకు ప్రభుత్వపరంగాను, ప్రభుత్వేతర సంస్థల ద్వారాను కృషి చేసారు. ఎంతో మంది వృద్ధ కళాకారులకు వారి వృద్ధాప్యంలో ఉపకారవేతనాలు లభించేటట్లు చూసారు. అలాగే వృద్ధిలోకి వస్తున్న యువకళాకారులకు గుర్తింపు కలిగే లాగ ప్రోత్సాహం అందేలాగ అనేక కార్యక్రమాలు సుమారు **25-30** సంవత్సరాలు చేపట్టారు - ఇలా కళారంగ అభివృద్ధి కేగాక, శాసన మండలి రాజ్య సభా సభ్యుడుగా కూడ **25** సం॥ ల కుపైనే దేశసేవచేశారు. ఒక మేధావిగా, పరిపాలనా దక్షుడుగా వీరి ప్రతిభను గుర్తించి, కాంగ్రెసు వారు వీరిని తమ పార్టీలోనికి ఆహ్వానించి, పార్టీలోను చట్ట సభలలోను ప్రముఖపాత్రలను వీరికిచ్చారు. మొత్తానికి ఆనందం గారు బహుముఖ ప్రజ్ఞాశాలి అని చెప్పుకోవాలి.

వీరి జననం మద్రాసు నగరంలోని అడయారులో **1919** మే నెల **13**వ తేదిన జరిగింది. తండ్రిగారు ఆచార్య శ్రీమామిడిపూడి వేంకటరంగయ్యగారు, తల్లిగారు శ్రీమతి వెంకమ్మగారు. తల్లి తండ్రులకు వీరు అయిదవ సంతానం. **1939**లో ఆంధ్ర విశ్వవిద్యాలయం, వాల్తేరు నుండి బి.ఏ. పరీక్ష మొదటి శ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. ఆ

తరువాత మద్రాసులో ఫ్రేజరు ఆండ్రూస్ అనే విఖ్యాత కంపెనిలో శిక్షణ పొంది 1942 నాటికి రిజిస్ట్రర్డు ఎకౌంటెంటు పరీక్షలన్ని ప్యాసయారు. ఆ తర్వాత అదే సంవత్సరంలో అప్పటి నిజాము ఏలుబడిలో ఉన్న హైద్రాబాదుకు వచ్చారు. స్వల్ప కాలం ఉద్యోగం చేసిన తర్వాత వారే స్వయంగా రాబడిపన్ను, యితర పన్నులకు సంబంధించి ప్రాక్టీసు పెట్టారు. అతి త్వరలోనే నిజాము పరిపాలిత ప్రాంతం అంతటిలో ఘనమైన ప్రఖ్యాతి గడించి, చిన్నవయస్సులోనే పెద్ద ప్రాక్టీసు సంపాదించారు. పది సంవత్సరాలు వృత్తి పైనే కేంద్రీకరించిన వారిదృష్టి 1951-52 నాటికి సంగీత, నాట్య, నాటక కళలను ప్రోత్సహించే ప్రయత్నంపై బడ్డది. త్యాగరాజగాన సభ, భారతీయ నాట్య సంఘం, ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకాడమి, రవీంద్రభారతి వంటి సంస్థలలో అతి ముఖ్యపాత్ర వారువహించి ఎంతో కృషి చేసారు.

అదే రోజుల్లో ఆంధ్ర శాసన మండలికి పట్టభద్రుల తరపున ఎన్నికై మూడుసార్లు వరుసగా ఆ సభనలంకరిచారు. ఎన్నో కమిటీలలో సభ్యుడిగా ఉండటమేగాక, కొన్ని సంవత్సరాల పాటు మండలికి ఉపాధ్యక్షులుగా కూడ వ్యవహరించారు. మండలి సభ్యునిగా వీరి ప్రతిభను గుర్తించి, 1969 లో వారిని కాంగ్రెసు పార్టీ తరుపున రాజ్య సభకు ఎన్నుకొన్నారు. మరల 1974 లో వారిని ఆంధ్రప్రదేశ్ ప్రతినిధిగా రాజ్యసభకు యింకొక సారి ఎన్నుకొన్నారు. ఢిల్లీలో కూడ వారిని ఎన్నో ముఖ్యమైన పార్లమెంటు కమిటీలలో సభ్యుని గా ఎన్నుకోన్నారు.

1980లో రాజకీయ రంగం నుంచి విరమించుకొని, కళారంగ సేవకు, సంఘ సేవకు వారుతమ జీవితాన్ని అంకితం చేసారు. ఆంధ్ర మహిళాసభ జీవిత ట్రస్టీగా,

దుర్గాబాయి దేశముఖ్ వైద్యశాల సెక్రటరీగా మామిడిపూడి వెంకటరంగయ్య ఫౌండేషను మానేజింగు ట్రస్టీగా వారు సంఘానికి ఎనలేని సేవలు యిప్పటికి చేస్తున్నారు. 79 సంవత్సరాల వయస్సులో కూడ, ఆరోగ్యం క్షీణించినప్పటికి వారి మేధస్సు ఎప్పటి వలెనిశితం ఉన్నది.

వారు స్వయంగా నిరాడంబరులు. అతి ఉదార స్వభావులు, ఎంతో మంది వ్యక్తులకు, సంస్థలకు ఉదారంగా విరాళాలిచ్చి వారివృద్ధికి తోడ్పడ్డారు సంగీత, సాహిత్య, నాటక కళలంటే విపరీతమైన అభిమానం, వీటి అభివృద్ధికి, పోషణకు వారెంతో సేవ చేయడమేగాక, భూమి విరాళాలు కూడ యిచ్చి ఉన్నారు. విశేషమేమిటంటే, చాలా మటుకు వీరి విరాళాలు అజ్ఞాతంగానే చేసారు.

వారి అదృష్టమేమిటంటే, వారికి అతి అనుకూలవతి, వారి కెంతో సహాయం, ప్రోద్బలం, యిచ్చి వారి కుటుంబానికేగాక, బంధుమిత్రులకు కూడ అనేక విధాల తోడ్పడిన వారి సతీమణి శ్రీమతి సీతను గరించి కూడ యిక్కడ చెప్పుకోవాలి.

అటువంటి ఆ ఆదర్శ దంపతులకు దేవుడు దీర్ఘ ఆయురారోగ్యాలు ప్రసాదించి, కుటుంబానికి, దేశానికి కూడ వారి సేవలు యింకా ఎంతో కాలం లభించునట్లు చేయ వలెనని ప్రార్థించు చున్నాను.

మా కృష్ణమూర్తి

# ఈశావాస్యోపనిషత్తు - మున్నుడి

వేదములలో యజుర్వేద మొకటి. ఇది, కృష్ణ యజుర్వేద మని (బ్రహ్మ సంప్రదాయము), శుక్లయజుర్వేదమని (ఆదిత్య సంప్రదాయము) రెండు విధములు. శుక్లయజుర్వేదమునకు, వాజసనేయ సంహిత, మాధ్యందిన సంహితయనియు పేర్లు కలవు. కృష్ణ యజుర్వేదములో కొంత మంత్ర భాగము కొంత బ్రాహ్మణ భాగమున్నవి. శుక్ల యజుర్వేద మంతయు మంత్ర మయమే.

ఉపనిషత్తు : బ్రహ్మ విద్యా ప్రతిపాదకము. గురుని సమీపమున నుండి పొందబడుటచే ఉపనిషత్తుని వ్యవహృతమైనది. అష్టోత్తర శతోపనిషత్తులు ప్రసిద్ధములు. వానిలో పదింటికి శ్రీ శంకరాచార్యులు భాష్యమును రచించిరి.

ఈశోపనిషత్తు : శుక్ల యజుర్వేదములో నలుబది అధ్యాయములున్నవి. అందు, అంతి మాధ్యాయమున, పదునెనిమిది మంత్రములున్నవి. వేదభాగమైనను, మంత్రమయ మైనను, ఈ నలుబదవ అధ్యాయమునకు, చిత్రముగా ''ఉపనిషత్తు'' అనెడి నామధేయము రూఢి అయినది. అదియును గాక, వేదతత్త్వ జ్ఞానమును ప్రతిపాదించు విజ్ఞానమున కంతటికివేదాంతమనెడి పరిభాష ఏర్పడుటకు ఈ పదునెనిమిది మంత్రములే కారణమని ఊహింపబడుచున్నది. ఈ అధ్యాయము నందు మొదటి మంత్రము, '' ఈశావాస్యమ్ ఇదమ్ సర్వమ్'' అని ప్రారంభ మగుచున్నది. దీనిని బట్టి ఈ మంత్ర సముదాయమునకు ఈశోపనిషత్తు లేదా ఈశావాస్యోపనిషత్తు అను పేర్లు కలిగినవి. దీనిసే వాజసనేయ ఉపనిషత్తనియు అందురు. వాజి రూపుడైన సూర్యుని చేత, మధ్యాహ్నవేళ వాజసనేయుడైన యాజ్ఞవల్క్యునికి ప్రసాదింపబడుటచే

వాజసనేయ సంహిత అని పేరు కలిగెనని పెద్దలు వచింతురు. యాజ్ఞవల్క్యుని పూర్వులు అన్నదానవముచేసి ''వాజసేని'' అని బిరుదు పొందిరట. (డాక్టరు ముట్నూరి సంగమేశము. వేదవాఙ్మయము. - పుట 19) కనుక యాజ్ఞవల్క్యుడు వాజసనేయుడు. సంహితలో చోటు చేసి కొన్నది యిదొక్కటే అని మనము గుర్తింప వలెను.

ఇందు పదునెనిమిది మంత్రములు మాత్ర ముండుటచే లఘూపనిషత్తు. పండ్రెండు మంత్రములు కలిగి, అధర్వ వేదమునకు చెందిన ఓంకార మహత్వమును ప్రవచించు, మాండుక్యము కంటె ఇది ఇంచుక పెద్దది. ఇందలి మంత్రములు, జ్ఞాన కర్మ భక్తి మార్గముల సమన్వయమును ప్రతిపాదించుచున్నవి.

భగవద్గీతకు బీజమై, సమస్త వేదసారమై సర్వభూత సమానతను, సులభ గ్రాహ్యమున ప్రకటించుటచే ఇది గుణములచే మిన్నమై ఉన్నది. సర్వ వేదాంతమునకు ప్రతినిధియై ప్రకాశించు, మహనీయ మంత్రములు కలది అను ప్రశంసకు అర్హమై వెలయుచున్నది. చివఱ ఓంకార పరబ్రహ్మ ప్రార్థన ముండుట యొక విశేషము. ఈ ఉపనిషత్తులో తొలి రెండు మంత్రములు, గాంధీ మహాత్మునికి ప్రియతమములట. వారి శిష్యులు వినోబా భావే. ప్రతి దినము ప్రాతఃకాల ప్రార్థనను, 'ఈశావాస్యోపనిషత్తుతో' ప్రారంభించెడి వారట.

ఈ మంత్ర మహత్వమును గురించి ఆంధ్రజ్యోతి సంపాదకులు శ్రీనండూరి రామమోహనరావు ఈ క్రింది ప్రశంసా వాక్యములు వెల్లడించిరి.

''సమగ్రసుందరమైనది. సమస్తవేదాంత సుధాపూరం. అద్భుత కవితాత్మకం. అంతకంటె ఎక్కువగా మానవ జీవిత మార్గదర్శకం. అష్టోత్తర శతోపనిషత్తులలో ఏ

ఒక్కదాన్ని ఖిలము కాకుండా రక్షించు కొంటా వంటే, ఏ ఉపనిషత్తు అభిమానిని అడిగినా, తడుము కోకుండా ఠపీమని చెప్పడానికి వీలైన ఉపనిషత్తు''

(విశ్వదర్శనము, వారపత్రిక ఆంధ్రజ్యోతి 20-9-1991 పుటలు 16 నుండి 19 వఱకు).

వారి ప్రశంస నిత్యసం

సమాపము.

# శాంతి మంత్రము

# ఓమ్

## పూర్ణమదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణముదచ్యతే
## పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణమే వావశిష్యతే ॥

శాంతి శ్శాంతి

భావము :

ఓమ్ అదిపూర్ణము. ఇది పూర్ణము. పూర్ణము నుండి పూర్ణము వెల్వడినది. పూర్ణము నుండి పూర్ణమును తీసి వేసినను, పూర్ణమే మిగులును.

వివరణము : పూర్ణమునకు రెండర్థము లున్నవి. **1.** పరబ్రహ్మము ( అదృశ్యము, కనబడనిది), **2.** విశ్వము ( దృశ్యము - కంటికి కనబడు చున్నది).

ఆ పరబ్రహ్మము నుండి వెలువడిన విశ్వము, అందుండి, వెలువడి నప్పటికిని, మార్పు లేక ఉన్నది. ఇదియును పర బ్రహ్మమే. ఏ స్థితి యందైనను, సర్వము బ్రహ్మమే, పరబ్రహ్మము యొక్క పరిపూర్ణత్వమునకు, పరిణామము లేదు.

పద్యానువాదము :

కం॥ పూర్ణము బ్రహ్మము, జగమిది
పూర్ణము, యా పూర్ణు నుండి పూర్ణము వెడలెన్
పూర్ణం బగు నీ జగతికి
పూర్ణత్వము గూర్చి యుంక పూర్ణమె మిగులున్.

ఉపనిషత్ సుధ - చర్ల గణపతి శాస్త్రి.

ఆ. వె. పూర్ణ మద్ది యిదియు పూర్ణమే తెలియంగ
పూర్ణ మందె పుట్టు పూర్ణ మెపుడు
పూర్ణ మందునుండి పూర్ణము కై గొన్న
పూర్ణమే మిగులును పూర్ణ మట్లు.

అరిపిరాల వేంకట సోమయాజులు.

# ఈశా వాస్యోపనిషత్తు

## (వాజసనేయ సంహి తోపనిషత్తు)

## శుక్ల యజుర్వేదాంతర్గతము - 40వ అధ్యాయము.

## (అంతిమాధ్యాయము)

మంత్రము

ఓం ఈశావాస్యమిదం సర్వం యత్కించ జగత్యాం జగత్
తేన త్యక్తేన భుంజీథా, మాగృధః కస్య స్విద్ధనమ్ ॥

భావము॥ ఇది అంతయు ఈశునిచే ఆవరింపబడి ఉన్నది. మార్పును పొందు స్వభావము కల ఈ జగత్తులో అన్నింటియందు, ఈశుడున్నాడు. ఈశుడు లేనిది, కానిది, ఏదియును లేదు. త్యాగ భావముతో అనుభవింపుము. దేనిని ఆశింపకుము, ధన మంతయు ఎవరిది ?

### సర్వము పరబ్రహ్మము

వివరణము : ఈ మంత్రము లోని మొదటి పదము ''ఈశ'', ఈ ఉపనిషత్తునకు పేరైనిలిచినది. సర్వ వేదాంతమునకు, ఈ మొదటి మంత్రము, సంక్షేపరూప సిద్ధాంత

మని, ఇందు సర్వ ఉపనిషత్ సారమున్నదనియు చెప్పబడుచున్నది.

శ్రీగాంధీ మహాత్ముని ప్రియ శిష్యులలో నొకరైన ఆచార్య వినోబా భావేగారు ఈ మంత్రము, జ్ఞాన, కర్మ, భక్తి మార్గముల సమన్వయమును ప్రతిపాదించుచున్నదని, పదునెనిమిది అధ్యాయములు కల భగవద్గీతకు బీజమని విశ్వసించిరి.

ఈ మంత్రము, సర్వము ఈశుడు (జ్ఞానము), కోరికలు లేని ప్రవర్తన (కర్మ), ఈశ్వరార్పణ భావము (భక్తి) - అను మూడింటిని విశదపఱుచుచున్నది. ''కస్య స్విద్ ధనమ్'' ఈ పద జాలమున, ఆక్షేపార్థము ఉన్నదని, ఈ ధనమంతయు ఎవరిదనుటచే అంతయు ఈశునిదే అని సమాధానము గర్భితమని కొందఱు వ్యాఖ్యానము చేయుదురు. ఎవరికి తోచినట్లు వారు ఈ పదజాలమునకు అర్థమును గ్రహింప వచ్చును.

## 2

కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతం సమాః
ఏవం త్వయి నాన్య థేతోz స్తి న కర్మ లిప్యతే నరే॥

భావము : ఈ జగత్తులో కర్మలు చేయుచునే నూరేళ్లు జీవించుటకు సంకల్పించుకొనుము. ఇట్టి వాడయినచో నీకు కర్మఫలము అంటుకొనదు. నరుడైన నీకు ఇంతకంటె మఱొక మార్గము లేదు.

వివరణము : '' కర్మలు చేయుచు నూరేళ్లు జీవింపుము'' అనుటచే, నిత్య నైమిత్తిక

విశేష కర్మలను, వాని ఫలముల యందు, వాంఛలేక, జీవించి నంత కాలము ఆచరింప వలయు ననెడి ఉపదేశమున్నది.

మొదటి మంత్రము నివృత్తిని రెండవది ప్రవృత్తిని బోధించు చున్న దగుటచే, ఇవి విరుద్ధము లని జగద్గురువు శ్రీ శంకరాచార్యుల అభిప్రాయము. వారి దృష్టిలో ''జ్ఞాన కర్మణో ర్విరోధం పర్వతవత్''. దీనిని అనేకులు వ్యతిరేకింతురు. ఆధ్యాత్మిక సాధనకు జ్ఞానము, కర్మ, మఱియు, భక్తి ఇవి మూడును ముఖ్యమే. పరస్పర పోషకములని తలంపవలెను. (సంధ్యా వందనము, దేవ తార్చనము - నిత్య కర్మలు. ఉపనయన వివాహాదులు - నైమిత్తిక కర్మలు. సామాజిక, సామూహిక యజ్ఞక్రియలు - విశేషకర్మలు)

వీనిని, ఈశ్వ రార్పణ భావముతో ఆచరించినచో కర్మల వలన కలుగు మాలిన్యము నరునకు అంటదు. దుష్కర్మలు తమంతట, అవియే దూరమగును. నిష్కామ కర్మచే చిత్త, శుద్ధి, ఆత్మజ్ఞాన మందు ఆసక్తి అతిశయించును. సామాన్యులు కర్మలు చేయుచు, ఉన్నత పథములను పొందుటకు ఇది చక్కని సూచన.

పద్యానువాదము :

కం॥ ధర కర్మలు చేయుచునే
నిరతము నూఱేండ్లు బ్రతుక నెంచగ వలయున్
మఱొక గతి లేదు నీ కిక
అరసి యిటుల చేయ కర్మలంటవు నరునిన్

ఉపనిషత్ సుధ : చర్ల గణపతి శాస్త్రి

## 3

అసు(సూ)ర్యా నామతే లోకా అంధేన తమ సావృతాః
తాంస్తే ప్రే త్యాభిగచ్ఛంతి యేకే చాత్మ హనో జనాః॥

భావము : ఎవరైతే, ఆత్మ నెఱుగరో వారు మృతులై దట్టమైన చీకటి గల లోకములను పొందెదరు.

### ఆత్మ హనులు

వివరణము : అసుర్యాః = అసురుల యొక్క అని అర్థము. 'అసూర్యాః' అనగా సూర్యస్పర్శలేని, అని అర్థము. ఆత్మ హనులు అనగా, ఆత్మను నిరసించువారు; ఆత్మను హత్మ చేయువారు; ఆత్మను ఎఱుంగనివారు ; ఆత్మను అనుభవింపని వారు; అని అర్థములను చెప్పవచ్చును. ఆత్మను గుర్తింపని వా రనుట ఉచితమేమో!

దేహమే సర్వము అని, అందు కల ఆత్మను చూడనివారు, ఆత్మను చంపు కొన్న వారగుదురు. ఆత్మ జ్ఞానము పట్ల ఉదాసీనులయిన వారు, మూఢులు. పశు తుల్యులు. సత్కర్మలను ఆచరింపక, భోగములందు ఆసక్తులై సంసార చక్రమున మరల మరల పరిభ్రమించెదరు. చీకటి లోకములలో జన్మలను పొందెదరు. తమో గుణ ప్రధానులగుటచే వారికి ఇట్టి దుర్దశ తప్పదు.

''సమతానంద'' గారు (శ్రీరామ కృష్ణ ప్రభ - సంపుటము **34**-సంచిక **4** ఏప్రిల్ **1977**) ఇట్లు చెప్పిరి - పుట **102.**

ఆత్మహానులు :

ఆత్మను చంపుకున్నవారు ; ఆత్మజ్ఞానము పట్ల ఉదాసీను లైన వారు స్వస్వరూప జ్ఞాన రహితులు. ఆధ్యాత్మికంగా ఆత్మహత్య చేసుకున్న వారితో సమానులు. ఆత్మ జ్ఞానం పొందని వారు, కేవలం కర్మ మార్గమునకే అర్హత కలవారు వివిధ లోకాల్లో జన్మ పరంపర పొంద వలసినదే.

ఆత్మ సాక్షాత్కారం కంటే, ఈస్థితి మహా నికృష్టమైనదని ఈ మంత్రతాత్పర్యము. ఈ మంత్రము, కర్మలయందు ఆసక్తులైన వారికి వర్తించును. వారికి ముక్తి లభింపజాలదు.

అనేజదేకం మనసో జవీయో నైనద్ దేతా ఆప్నువన్ పూర్వ మర్షత్
తద్ధావతో న్యా నత్యేతి తిష్ఠత్ తస్మిన్నపో మాతరిశ్వా దధాతి ॥

భావము : ఆత్మ ఒక్కటే. అది కదలదు. మనస్సునకు మించిన వేగము కలది. దీనిని ఇంద్రియములు సమీపింపజాలవు. అది కదలకయే, పరుగెత్తుచున్న వాని నన్నింటిని, అతిక్రమించి పోవును. విశ్వశక్తి (ప్రాణవాయువు) ఆ, ఆత్మ ఉనికిచే చేతనముల (ప్రాణుల) కార్యములను నిర్వహించుచున్నది.

## ఆత్మ స్వరూపము

వివరణము : ఆత్మ చిత్రమైనది. కదలకయే కదలించుట, వైరుధ్యమే ! దేని మీదను ఆధారపడదు. నిరుపాధికము. మఱియు సోపాధికము, అనగా, ఇతరముల కన్నింటికి ఆధారమైనది. పరమాత్మ - సర్వవ్యాపి అగుటచే పై లక్షణము లన్నియు వర్తించును.

సకల భూతముల యందు, వసించుచు, వాని కన్నింటికి ఆధారమై, వానిని సంరక్షించుచుండును. (అమృతబిందూపనిషత్తు - తుది మంత్ర భావ మిది).

## 5

త దేజతి త న్నైజతి త ద్దూరే త ద్వంతికే
త దంత రస్య సర్వస్య తదు సర్వ స్యాస్య బాహ్యతః॥

భావము : ఆత్మ చలించును. (సగుణ స్థితి). చలింపదు (నిర్గుణ స్థితి). అది దూరములో ఉన్నది. అజ్ఞానికి దూరము. సమీపములో ఉన్నది. జ్ఞానికి తనలో ఉన్నది. అన్నింటికి లోపలను, వెలుపలను ఉన్నది.

### ఆత్మయే పరమాత్మ

వివరణము : అజ్ఞానులకు అందదు. వారు ఆ పరమాత్మ స్వరూపమను ఎఱుగజాలరు. జ్ఞానులు తమలో గల ఆత్మ పరమాత్మ అని అనుభూతికి లో నగుదురు. కనుక జ్ఞానికి సమీపములో నున్నదనుట. మఱియు అంతటను ఉన్నది. సర్వవ్యాప్తి కలది. నిత్యము. స్థిరము.

## 6

యస్తు సర్వాణి భూతాని ఆత్మ న్యే వానుపశ్యతి
సర్వ భూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే ॥

భావము : ఏ జ్ఞాని తనలో సర్వభూతములను, మఱియు సర్వ భూతములందు, తన్ను దర్శించునో, అతడు దేనిని ఏవగించు కొనడు.

వివరణము : తనలో అనుటచే, తన ఆత్మయందని భావము. సర్వ భూతములందు అనుటచే సర్వ భూతాత్మల యందు అని గ్రహింపవలెను. అన్నింటిలో ఆత్మ ఒకటే. అది కానిది వేఱొకటి ఎచ్చటను లేదు.

''సమతానంద'' శ్రీరామకృష్ణ ప్రభ - సంపుటము **34** - సంచిక **5** మే నెల **1977** పుట **137** ఇట్లు వివరించిరి.

ఏ జ్ఞాని సర్వ భూతములను తన ఆత్మగాను ( ఆత్మ కంటె భిన్నము కానివి గాను) తన ఆత్మను సర్వభూతముల ఆత్మగాను గ్రహించునో, ఆ జ్ఞాని ఆ అనుభూతి వలన దేనిని ద్వేషింపడు. (అసహ్యించు కొనడు).'

భారతీయ సంస్కృతికి '' ఆత్మవత్ సర్వభూతాని'' అను నుడి ప్రధానము. కనుక నరుడు సర్వ భూత దయా పరుడు కావలెను. ఈ మంత్రము ఉదాత్తముగా, సర్వభూత సమతను ప్రతిపాదించుచున్నది. అన్నింటికి, ఆత్మ ఒకటే అగుటచే యోగి ఆ అనుభూతికి లోనై, అన్నింటిని ప్రేమించును. స్వార్థ ముండదు. భేద భావ ముండదు. ఇంక ద్వేషమునకు కారణ మేమియు లేదు.

## 7

యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవాభూ ద్విజానతః
తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః ॥

భావము : ఏ జ్ఞాని సర్వభూతములు ( తానుకూడ) ఒకే ఆత్మ అని అనుభూతికి

వశుడగునో ఆస్థితిలో అతడు అన్నింటిలో, ఏకత్వమును దర్శించును. ఆ విజ్ఞానికి మోహమేల ? శోకమేల ?

## జ్ఞాని 'స్వ', ''పర'' భేద రహితుడు

వివరణము : లోకములో వైవిధ్యమందు ఏకత్వమును కాంచు విజ్ఞాని రాగ ద్వేషములను గాని, సుఖ దుఃఖములను గాని పొందడు. అనగా ద్వంద్వాతీతుడు. అతనికి అవి కలుగవు. పరమాత్మయందు అద్వితీయ భావము (ఒకటే అనుతలంపు) స్థిరమై ఆత్మ సాక్షాత్కారమగును.

8

సపర్యగా చ్ఛుక్ర మకాయ మవ్రణ
మస్నావిరం శుద్ధ మపాప విద్ధమ్
కవి ర్మనీషీ పరిభూః స్వయం భూ ర్యాథాతథ్యతో
ర్థాన్ వ్యధదాచ్ఛాశ్వతీభ్యః సమాభ్యః ॥

భావము : ఆ పరమాత్మ 1 సర్వవ్యాపి 2. స్వయం ప్రకాశము 3. అశరీరి 4. పూర్ణము 5. మాంస రహితము (కండలు లేనిది) 6. పరిశుద్ధము 7. అజ్ఞాన దూరము 8. సర్వ ద్రష్ట 9. సర్వ జ్ఞాని 10. సర్వావృతము 11. స్వయంభువు 12. సర్వ విధి నిర్వాహకము.

వివరణము : సర్వ నియంత అయిన ఆత్మ సర్వమును శాసించును. క్రమమున

సర్వకాలానుగుణముగా ఆయా యుగము లందు తాను చేయవలసిన విధులను నిర్వహించును.

**6,7,8** మంత్రములను వెంపటి సూర్యనారాయణ గారు ఇట్లు వివరించిరి. వీనిలో '' ఈశ్వర భక్తుని వర్ణన కలదు. తనలో అందరిని అందరిలో తన్ను అతడు చూచుచుండును. ఇదియే ''భక్తి రూపము'' స్వ పర భేదములు నశించును, దిన దినమాతని ఆత్మ భావన వృద్ధి చెందుచుండును. ఇంతే గాదు, మానవునకు పశువునకు మధ్య కూడ భక్తుడు భేదము చేయడు. ఈ విధముగ నతడు స్వ పర భేదములను నశింపజేయును. ఇట్లు ప్రవర్తించు వాడు. ఆనంద మయ జీవితమును గడుపును.

## 9

అంధ తమః ప్రవిశన్తి యే విద్యా ముపాసతే
తతో భూయ ఇవతే తమో య ఉ విద్యాయాం రతాః ॥

భావము : ఎవ్వరైతే అవిద్యను ఉపాసింతురో, వారు దట్టమైన చీకటిలో పడుదురు. ఎవ్వరైతే మఱి విద్యయందే ఆసక్తులో వారు అంత కంటె అధికమైన చీకటిలో వలె పతన మగుదురు.

## అవిద్య, విద్య

వివరణము : అవిద్య = అజ్ఞానము, పరమాత్మను ఎఱుగకపోవుట. కర్మలను ఆచరించుట. విద్య = జ్ఞానము, వేదాధ్యయనమును కావించుట, వేదములను వల్లించుట, దేవతలు యజ్ఞ కర్మలు మొదలైన వానిని గుఱించి ఎఱుగుట. (వీరు వేదములోని పరమార్థమును గ్రహింపనివారు)

పై విధమైన ఆవిద్య, విద్య వలన సత్త్వ గుణముచే కలుగు ఫలము లభింపదు.

జ్ఞానమనగా, బహుత్వములో ఏకత్వమును దర్శించుట, అనియు భావింప వచ్చును. ఆ ఏకత్వ భావనలో లీనమై కర్మలకు దూరమైన వారును, మూఢుల వంటి వారే! కనుక ఇట్టి జ్ఞానుల కంటె, కర్మానుష్ఠాతలు మెఱుగైన వారనుట స్పష్టము. కర్మానుష్ఠానము, బ్రహ్మజ్ఞానము, రెండును ముఖ్యమే. సారమే మనగా కర్మ జ్ఞానముల రెండింటిని భగవ దర్పణ భావముతో ఉపాసించినప్పుడే సత్ఫలము కలుగును. సత్త్వ శుద్ధి చేకూరి (పరమ పదము) ముక్తి మార్గము సుగమమగును.

పద్యానువాదము :

క॥ నిరత మవిద్యనె కొలిచెడి
నరుడజ్ఞా నాంధకార నరకమున బడున్
నిరతము విద్యనె కోరెడు
నరుడింక మహాంధకార నరకమున బడున్.

ఉపనిషత్సుధ - చర్ల గణపతి శాస్త్రి.

## 10

అన్యదేవాహు ర్విద్యయా అన్య దాహు రవిద్యయా
ఇతి శుశ్రుమ ధీరాణాం యే న స్తద్విచ చక్షిరే ॥

భావము : విద్యచే ఒక ఫలము; అవిద్యచే మఱొకఫలము అని, ధీమంతులైన పెద్దల వివరణ వలన విన్నాము.

## విద్య, అవిద్యల, ఫలము

వివరణము : యజ్ఞ క్రియల ఫలము దేవలోక ప్రాప్తి. కేవలము శుభ కర్మానుష్ఠాన ఫలము పితృలోక ప్రాప్తి. పితృ లోకములను పొందిన వారు, మరల జన్మింతురు. దేవలోకములను పొందినవారు, అచటి నుండి, ఊర్ధ్వ లోకములను చేరుట సంభవించును. పరబ్రహ్మ పద ప్రాప్తి వేఱు.

## 11

విద్యాంచా z విద్యాంచ యస్తద్వేదోభయం సహ
అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయా z మృత మశ్నుతే ॥

భావము : ఎవడేతే విద్యను, అవిద్యను, ఆరెండింటిని కూడ చక్కగా తెలిసికొనునో, అతడు, అవిద్యచే మృత్యువును తరించి విద్యచే అమరత్వమును సాధించును.

## అమరత్వము

వివరణము : కర్మ జ్ఞానముల యెడ సమా నాదరణము, ఆచరణము అతి ముఖ్యము. ఈ రెండిటిలో దేనిని తక్కువగా చూడ రాదు. దేనిని త్యజించినను ఫల మల్పమే!

శ్రీ శంకరాచార్యుల వ్యాఖ్యానములో అమరత్వమనగా, పరబ్రహ్మప్రాప్తి కాదు. అవిద్య (కర్మలు), విద్య (జ్ఞానము) విరుద్ధములైనను వాని యెడ సమాన భావమున్నచో, అవి పర బ్రహ్మప్రాప్తికి సోపానము లగును.

శ్రీ బ్రహ్మచారి చిన్మయ చైతన్యగారు " ఈశావాస్యోపనిషత్తు " అనుబంధములో - పుట 54. జ్ఞాన కర్మల సమన్వయ పరచు వ్యాఖ్యను కావించిరి. వారి అభిప్రాయము ఈ తీరున ఉన్నది.

జగత్తు బహుత్వమయము. ఏకత్వము అంతర్లీనమై ఉన్నది. బహుత్వములో (అవిద్య), ఏకత్వము (విద్య) ఉన్నదని, ఏకత్వమే బహుత్వము కలదగుచున్నదని గ్రహించి, అపరోక్ష బ్రహ్మములో నిమగ్నుడైన భక్తుండు శాశ్వత సర్వాతిశయ మోక్షానందమును పొందు ననిరి.

గమనిక : శ్రీరామకృష్ణ ప్రభలో - సంపుటము 34 - సంచిక 6 (జూన్ నెల 1977 - పుటలు 190-191) 8,9,10,11 పద్యములకు శ్రీ సమతానందగారి వ్యాఖ్యానమున్నది. తరువాతి సంచిక 7లో (జులై 1977, పుటలు 204-205,) 15, 16,17,18 మంత్రములకు మాత్రమే వ్యాఖ్యానమున్నది.

## 12

అంధతమః ప్రవిశన్తియే z సంభూతి ముపాసతే
తతో భూయ ఇవ తే తమో య ఉసంభూత్యాం రతాః ॥

భావము : ఎవరైతే అసంభూతిని (అవ్యక్త ప్రకృతి - కారణము) ఉపాసింతురో, వారు దట్టమైన చీకటిలో పడుదురు. ఎవరైతే సంభూతి యందే (వ్యక్త ప్రకృతి - కార్యము) అనురక్తులో వారు అంతకంటె అధికమైన చీకటిలో వలె పతన మగుదురు.

ఈ మంత్రమును పఠించునపుడు 9వ మంత్రార్థమును పోల్చి చూడవలెను.

9వ మంత్రము జ్ఞాన కర్మల విషయము.

12వ మంత్రము నిర్గుణ సగుణ బ్రహ్మల విషయము.

9వ మంత్రము : అవిద్యను (అజ్ఞానము) ఉపాసించువారు చీకటిలో పడుదురు. విద్యను (జ్ఞానము) ఉపాసించువారు అంతకంటె అధికమైన చీకటిలో వలె పతన మగుదురు.

12వ మంత్రము అసంభూతిని ఉపాసించువారు చీకటిలో పడుదురు సంభూతియందు అనురక్తులు అంతకంటె అధికమైన చీకటిలో వలె పతన మగుదురు.

పై రెండింటి మంత్రార్థములను చక్కగా గ్రహింప వలసియున్నది. రెండింటికి చాల వ్యత్యాసమున్నదని ఎఱుగవలెను.

## అసంభూతి, సంభూతి

వివరణము : అసంభూతి అనగా అవ్యక్తమైన నిర్గుణ బ్రహ్మము కనబడనిది. సృష్టికి మూలకారణము.

సంభూతి : వ్యక్తమైన సగుణ బ్రహ్మము, కంటికి కన బడునది. జగత్తు కార్య బ్రహ్మము. పంచభూతాత్మకము.

### పద్యానువాదము :

కII నిరతము నిరోధము గొలుచు
నరుడజ్ఞానాంధకార నరకమునబడున్
నిరతము వికాసము కొలుచు

నరుడింక మహాంధకార నరకమునబడున్

ఉపనిషత్ సుధ - శ్రీ చర్ల గణపతి శాస్త్రి

ఈ పద్య భావమును శ్రీ వెంపటి సూర్యనారాయణగారు ఇట్లు విశద పరచిరి.

''మన హృదయము సద్గుణములతోను, దుర్గుణములతోను నిండియున్నది. కనుక మన మేమి చేయ వలెను ? సద్గుణములను సమకూర్చుకొని వానిని వికసింప జేసికొవలెను. (వికాసము) ఉజ్జ్వల మగునట్లు చేసికొనుట. దుర్గుణములను దరి చేర నీయకుండుట. నూతన దోషములు ఉత్పన్నములు కాకుండ చూచుకొనవలెను. (నిరోధము) ఉన్న దోషములను నశింప జేసి కొనవలెను.......''

దుర్గుణ నిరోధము, సద్గుణ వికాసము, అంత్య లక్ష్యములు కావు. చిత్త శుద్ధి, మోక్ష సాధనకు సోపానము.

ఈ మంత్రములోని పదాలకు పూజ్యాశ్రీ భక్తివేదాంతస్వామి ప్రభుపాదుల వారు, ఈ క్రింది విధముగా వివరణ నిచ్చిరి.

అసంభూతి : సామాన్య దేవతలు (ప్రకృతి) స్వతంత్రమైన జీవితం లేనివారు.

సంభూతి : నిరాకారమైన పరమ సత్యం. సర్వ స్వతంత్రుడైన పరమ పురుషుడు.

ఈశోపనిషత్ : ఆంధ్రానువాదం, పుట 65. డా॥ దివాకర్ల వేంకటావధాని - 1996.

## 13

అన్య దే వాహు ః సంభవా దన్య దాహు రసంభవాత్

ఇతి శు(శుమ ధీరాణాం యేన స్త ద్విచచక్షిరే ॥

భావము : సంభవము వలన - (సంభూతి - సగుణ బ్రహ్మము), ఒక ఫలము, అసంభవమువలన (అసంభూతి - నిర్గుణ బ్రహ్మము), మఱొక ఫల మని ధీమంతులైన పెద్దల వివరణవలన విన్నాము.

### సంభూతి, అసంభూతి - ఫలము

వివరణము : కంటి కనబడు కార్య బ్రహ్మమును ఉపాసించుట వలన, అష్టసిద్ధులు, కారణబ్రహ్మను, ఉపాసించుటచే ప్రకృతి లీనత్వము లభించునని శ్రీ శంకరుల అభిప్రాయమని, చెప్పబడినది. (**38,39,** పుటలు - బ్రహ్మచారి చిన్మయ చైతన్య అనువాదము - ఈశావాస్యోపనిషత్తు - **1985**)

## 14

(అ) సంభూతిం చ వినాశం చ, య స్త ద్వేదోభయం సహ

వినాశేన మృత్యుం తీర్త్వా సంభూత్యాz మృత మశ్నుతే ॥

భావము : ఎవడైతే (అ) సంభూతిని వినాశమును రెంటిని కూడ చక్కగా తెలిసికొనునో, అతడు ఈ వినాశముచే, మృత్యువును తరించి (అ) సంభూతిచే అమరత్వమును పొందును.

వివరణము : సంభూతి అనగా వ్యక్త ప్రకృతి. 'అసంభూతి' అనగా, అవ్యక్త ప్రకృతి. వినాశమనగా వ్యక్త ప్రకృతి. కనుక, స్పష్టార్థము 'అ' వర్ణమును శ్రీ శంకరాచార్యులు, 'సంభూతి' శబ్దమునకు ముందు, చేర్చినచో, 'అవ్యక్త ప్రకృతి' అను అర్థము వచ్చుననిరి. 'అ' వర్ణమును చేర్పకయే శ్లోకమును అర్థము చెప్పవచ్చునని శ్రీ ఉవటాచార్యులు వచించిరి. వారి మతమున, 'సంభూతి' అనగా సర్వ సృష్టి కారణమైన పరబ్రహ్మము. వినాశమనగా నశించు శరీరము. నరుడు నశ్వరమైన శరీరముచే కర్మలను ఆచరించి, మృత్యువును తరించి, సంభూతిచే (బ్రహ్మజ్ఞానముచే) అమరత్వమును పొందునని భావము.

(ఈ అర్థమును బ్రహ్మచారి చిన్మయ చైతన్యులు - తమ అనువాదమందు - **39, 40** పుటలలో తెల్పిరి).

శ్రీ శంకరాచార్యుల వివరణను శ్రీ వేదాంత దేశికులు, శ్రీ కూర నారాయణులు నిరసించిరి. వారిట్లనిరి.

''అత్ర సంభూతి వినాశ శబ్దాఖ్యామ్, సృష్టి ప్రళయ వివక్షయా, కార్య హిరణ్య గర్భస్య అవ్యాకృత ప్రధానస్య చోపాసనమ్ విధీయత ఇతి శంకర వ్యాఖ్యానమ్ అనుపపన్నమ్''.

## 15

హిరణ్మయేన పాత్రేణ సత్యస్యా z పిహితం ముఖమ్
తత్త్వం పూష న్నపావృణు సత్య ధర్మాయ దృష్టయే ॥

భావము : బంగారు పాత్రచే సత్యదేవత ముఖము కప్పబడియున్నది. ఓ సూర్యదేవా! సత్య ధర్మ నిష్ఠ గల నేను చూచుటకై కాంచన పాత్రను (మూతను) తొలగింపుమా !

### సూర్య దేవ ప్రార్థనము

వివరణము : సూర్యుడు విశ్వమునకు కేంద్రము. పోషకుడు మఱియు అంత ర్యామియైన ఆసత్యదేవత (పరమాత్మ) తేజము తన యందు కలవాడు. ఆ దేవత ముఖమును (ద్వారమును), మెఱయు సూర్యుని బంగారు వన్నె కల బింబము, మూత వలె కప్పియున్నది. ఆ మూతయే మోహమనెడి ఆవరణమని గ్రహింప వలెను. భక్తుడు ఆదిత్యుని, తన మోహమును ( ఆ మూతను) తొలగింపుమని అర్థించుచున్నాడు. సత్య దర్శనమునకై నిరీక్షించు సాధకుడు సవితృ భర్గస్సులో గల ఆ దేవత యొక్క సాక్షాత్కారము కొఱకు తపించుచున్నాడు. మోహము అనగా భౌతిక సుఖానుభవము. అది సత్య దర్శనమునకు నిరోధము. అది తొలగిననే సత్య దేవత ప్రత్యక్షమగును.

**15,16** మంత్రముల, సూర్యుడే - నారాయణుడనెడి భావమును వ్యక్తము చేయుచున్నవి.

**15,16.17,18,** మంత్రములు భక్తుడు చేయు ప్రార్థన. ప్రత్యేకముగా దహన క్రియలలో ఉచ్చరింపబడుట గమనింపదగియున్నవి.

పద్యానువాదము :

తే. గీ. పైపయి మెఱుంగు బంగారు పాత్ర చేత
కరము సత్యదేవత మోము కప్పబడియె
సత్యమగు ధర్మమార్గ దర్శనము కొఱకు
పోషకుడ ! తొలగింపు మీ మూత పాత్ర

ఉపనిషత్సుధ - శ్రీ చర్ల గణపతి శాస్త్రి

## 16

పూష న్నేకర్షే యమ సూర్య ప్రాజాపత్య
వ్యూహ రశ్మీన్ సమూహ తేజో యత్తే
రూపం కల్యాణ తమం తత్తే పశ్యామి
యో సా వసౌ పురుషః సోऽ హ మస్మి ॥

భావము : ఓ పోషకుడా ! ఏకర్షీ ( ఒంటరి బాటసారీ) ! నియంతా! సూర్యుడా! ప్రజాపతి సుతా! నీ తేజః పుంజమను ఉపసంహరించు కొనుమా! నీ అనుగ్రహముచే నీయందు గల కల్యాణతమ మగు ( మిక్కిలి మంగళకరమైన) నీ రూపమును చూచెదను. నీలో నుండు పురుషడను నేనే!

## కల్యాణతమ రూప దర్శనము

వివరణము : భక్తుడు (సాధకుడు) సవితృమండలాంత ర్వర్తినియైన సత్యదేవతా దర్శనమును కాంచి, పరవశుడై నిర్వికల్ప ఆనం దానుభూతికి లోనై, ఆ పురుషుడు తానే అని భగవ దనుగ్రహముచే గ్రహించెను, తెలిసి కొనువాడు. తెలసి కొనబడునుది. తెలిసికొనుట (తెలివి) మూడును, ఏకమైన ( ఆధ్యాత్మిక జ్ఞానోదయమైన) సమాధి స్థితి, ఇది. భక్తుని పరమ లక్ష్యమిదియే !

సూచన : ఈ మంత్రము మహర్షి శ్రీదయానంద సరస్వతి వ్యాఖ్యానములో లేదు.

## 17

వాయు రనిల మమృత మథేదం భస్మాంతం శరీరమ్

ఓం క్రతో స్మర కృతం స్మర, క్రతో స్మర కృతం స్మర॥

భావము : నా ప్రాణవాయువు (శ్వాస) శాశ్వతమైన విశ్వవాయువులో లీన మగుగాక ! ఈ శరీరము భస్మమగు గాక! ఓం జీవా! కృతమును (చేసిన కర్మలను) స్మరింపుమా ! ఓ జీవా! కృతమును తలంపుమా!

## మరణకాల విజ్ఞాపనము

వివరణము : మరణము కలుగునని, గ్రహించిన భక్తుడు, తాను కావించిన కర్మలను మననము చేసికొనును. ఆ స్థితిలో అతని మనస్సు పరిశుద్ధమై, బ్రహ్మసాక్షాత్కారమునకు సిద్ధమై యుండును. కనుక, తదనుగుణముగా అనంతర

జన్మలు సంభవింప గలవు. భక్తుడు ''ఓమ్'' అను ప్రణవ రూప బ్రహ్మమును, ధ్యానము చేయుచున్నాడు.

సూచన : కర్మ ఫలము పూర్తిగా క్షయమైనపుడే పునర్జన్మ ఉండదు. ఈ మంత్రమున ఓంకార పూర్వకముగా మనస్సును, తాను చేసిన కర్మలను స్మరింపుమని అర్థించు చున్నాడు. ఓం కారము గొప్ప మంత్రము. యోగ శిఖోపనిషత్తు ' ఓంకారము కంటె' మఱొక గొప్ప మంత్రము లేదని నుడువుచున్నది. కఠోపనిషత్తు. ' ఈ ప్రణవము నెఱిగిన వాడు ఏది కోరినను అది వానికి లభించునని చెప్పుచున్నది. అన్ని ఉపనిషత్తులలో చాల చిన్నది. పండ్రెండు మంత్రములు కల మాండుక్యోపనిషత్తు ''ఓం'' అను నదే సర్వ ప్రపంచము. అది మూడు కాలములు, మూడు శరీరములు మూడు అవస్థలు అనెడి వానికి అన్నింటికి అతీతమని, అకార ఉకారమకార త్రయము, ఓం కారములో అమాత్ర యగుచున్నదని, దానిని జపించిన భక్తుడు కల్యాణ మయ నిర్గుణ నిరాకార పరమాత్మయందు స్థితుడగు నని ఘోషించు చున్నది. కనుక మరణ సమయమందు ఓంకార మంత్రమును భక్తుడు మననము చేయు చున్నాడు. ముండకోపనిషత్తు జీవమనెడి బాణము ప్రణవ మనెడి ధనుస్సుచే బ్రహ్మమనెడి లక్ష్మమును సమీపించునని తేట పరచినది.

భగవద్గీతలో ఇట్లున్నది.

శ్లో. ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహర న్మా మనుసరన్

యః ప్రయోతి త్యజన్ దేహం స యాతి పరమా గతిమ్ (8వ శ్లో-13)

భావము : బ్రహ్మపదమైన 'ఓం' అనెడి ఏకాక్షరమును ఎవడు ఉచ్చరించుచు శరీరమును విడిచిపోవునో, అతడు పరమ పదమును చేరును.

## 18

అగ్నేనయ సుపథా రాయే అస్మాన్ విశ్వాని దేవ వయునాని విద్వాన్

యయోధ్యస్మ జ్జుహురాణ మేనో భూయిష్ఠాం తే, నమ ఉక్తిం విధేమ॥

భావము : ఓ అగ్ని దేవా ! మమ్ము మా సుకృత ఫలములను పొందుటకు సుపథమున తీసికొని పొమ్ము. మా అన్ని కర్మలను తెలిసికొని, మా కుటిలమైన పాపములను నిర్మూలింపుము (మమ్ము అంటకుండజేయుము). మేము నీకు అనేకములైన నమస్కార వచనములను అర్పించుచున్నాము.

అగ్ని దేవ నమస్కారము

వివరణము : అగ్ని, హోమాగ్నిలో అర్పింపబడిన హవిస్సును ఆయా దేవతలకు చేర్చు మధ్యవర్తి. అందఱిని ఎఱిగిన వాడు. పవిత్రుడు. శరీరము దుర్బలమై ఉండుటచే 'పెక్కు నమస్కార వచనములను అర్పించు చున్నాము' అని భక్తుడు బహువచనమును ప్రయోగించి, అగ్నిని ప్రసన్నుని చేసికొను చున్నాడు. సర్వజనులు సుఖులగుదురుగాక, అను ధ్వనితో, మంగళాంతముగా. అగ్ని దేవ ప్రార్థన సమాప్త మగు చున్నది. ఈ మంత్రములో భక్తుని సంపూర్ణ అర్పణ భావము వ్యక్తమగుచున్నది.

ఓమ్

శాంతి ః శాంతి ః శాంతి ః

# " ISOPANISHAD"

A brief summary of the 18 manthras is presented here to enable the reader to grasp the basic ideas contained in them.

## SANTHI MANTRA

That (INVISIBLE) is Perfect (full). This (visible) is Perfect (full). The Perfect has come out of Perfect. Yet this Perfect remains as before Perfect.

## MANTRA

1. Isa is in every thing that changes. Lead your life with detachment. Whose wealth is this ?
2. Resolve to lead your life for hundred years, without desires. This is the best way to free yourself from attachment.
3. Those Ignorant of their Soul (Atma) go to the worlds of great darkness.
4. Soul (Atma) is constant and only one. Its speed is greater than that of the mind. None can comprehend its power. Soul rules every thing to function.
5. Soul has movement and no movement. It is far and near. It is inside all creation and also outside.
6. He who sees every creature in himself and also finds himself in all others, has no dislike for anything.
7. He who learns that he and everything are one and the same, has no attachment or sorrow.

8. Soul is infinite, all powerful and splendourous.

9. Who so ever performs his deeds (duty) with Avidya (being ingnorant of Brahman) falls into darkness. Who so ever revels in Vidya (general Knowledge of Vedic rites, and Devathas (gods), studying and reciting Vedas without knowing their essence (Brahman) reaps a worse fate.

10. The results of vidya and Avidya are different. The wise enlightened this fact. The mere discharge of duty and general knowledge of Vedas etc., do not lead anyone to attain salvation.

11. Vidya and Avidya are both essential. Avidya frees one from death and vidya takes him to a superior world. Both serve as stepping stones to attain salvation.

By good deeds, one overcomes death and reaches the world of fathers (Pithru Loka). By Vedic sacrifices he obtains the immortal oneness with gods (of Devaloka) which is the last step to lead him to oneness with Brahman.

12. Those meditating upon invisible, formless Brahman fall into darkness. Those meditating upon visible Brahman with a form, reap a worse fate.

13. The results of the meditation of both are different. The wise men enlightened this fact.

14. (i) He who comprehends formless Brahman as well as Brahman with a form, frees himself from death though the Brahman with a form and attains superior world with formless Brahman.

(ii) He who knows at the same time both the cause and the destruciton (perishable body) overcomes death by destruc tion (Perishalble body) and obtains immortality thourgh knowledge of the true cause.

Max Muller F. The sacred Books of the East. Vol. I. page 313-1981.

(iii) He who can comprehend the full significance of Brahman without a name and without a form and also that Brahman with a name and with a form, recevies death from that Brah man with a name and with a form and immortality from that Brahman without a name and without a form.

Sri P. Krishna Murthy.
Isavasya and Kenopanishads - page 17-1973.

(iv) He who knows that as both in one, the birth and the dissolu tion of birth, - by the dissolution of birth, crosses beyond death and by the birth, enjoys immortality.

Sri. Aurobindo. The upanishads. Vol 12
Centenary Edition. page, 66-1972.

(v) He who understands the manifest and the unmanifest both together-crosses death through the unmainfest - and attains eternal life though the manifest.

Sri S. Radhakrishnan. The principal
upanishads. The centenary Edition. page 576-1989.

Please Note : The meanings of the words 'Sambhuti' and 'Vinasam' have given rise to different interpretations of the Mantra. So, there are two versions. 'Sambhuti' means visible creation which per ishes, 'Vinasam' also has the same meaning. So some Com prehend that Vinasam and Sambhuti have different meaning. According to them 'Sambhuti', refers to the invisible form.

15. The face of 'Divine Truth' is covered with gold lid. O Sun! Protector of Life! remove this lid to enable me, your devotee of Truth to see Truth.

16. O Sun! Son of prajapathi! Sustainer! Lonely Traveller! Controller of Everything! withdraw your Powerful glow to enable me to see your form as I am in you.

17. Let my birth merge in the Eternal Air. Let my mortal body be turned into ashes. Om! Lord of Vedic rites! (Jeeva) remember all my deeds.

18. O God of Fire! Lead us in the right path. to reap the fruits of our actions. Being aware of our acts, purify us from our sins. We offer to you our salutations.

Om! Peace! Peace ! Peace!

# ఉపయుక్త గ్రంథావళి


1. ఈశా వాస్యోపనిషత్తు - ( ఉపనిషత్సుధ పద్యములతో) శ్రీ చర్లగణపతి శాస్త్రి. సంపాదకుడు వెంపటి సూర్యనారాయణ, తెనాలి - 1959.

2. ఈశావాస్యోపనిషత్తు - శ్రీ మద్దయానందభాష్యోపేతము ప్రకాశకులు - ఆర్య సమాజము - కూచిపూడి - తెనాలి తాలూకా సంపాదకుడు - పండిత గోపదేవ్ - 1968 - రెండవ ముద్రణము.

3. శ్రీరామకృష్ణ - సంపుటము 34-1977

   1. సంచిక 3 - మార్చి - 1977 - పుటలు 73,74, ప్రథమ మంత్రము,

   2. సంచిక 4 - ఏప్రిల్ 1977 పుటలు 101, 102, - 2,3 మంత్రములు

   3. సంచిక 5 మే 1977 - పుటలు 136, 137 - 4 నుండి 7 వరకు మంత్రములు.

   4. సంచిక - 6 జూన్ 1977 - పుటలు 190, 191-8 నుండి 11 మంత్రములు

   5. సంచిక 7 - జులై 1977 పుటలు 204, 205-15 నుండి 18 మంత్రములు.

4. ఈశావా స్యోపనిషత్తు - అరిపిరాల వేంకట సోమయాజులు, బాపూజి నగర్ కొవ్వూరు. పశ్చిమ గోదావరి జిల్లా - 534 350-1980.

5. వేద వాఙ్మయము - డాక్టరు ముట్నూరి సంగమేశం టి.టి.డి. తిరుపతి - 1983

6. ఈశావాస్యోపనిషత్తు - శ్రీ శర్వానందస్వామి - (ఆంగ్లమూలము) తెలుగు అనువాదము శ్రీ బ్రహ్మాచారి చిన్మయ చైతన్య శ్రీ రామకృష్ణ మఠము - మైలాపూరు మద్రాసు - 600 004 రెండవ ముద్రణము - 1985.

7. ఈశావాస్యోపనిషత్తు - శ్రీరాణి సత్యనారాయణ. ఎమ్. ఏ. జూపిటర్ పబ్లిషర్సు రైలు పేట, రేపల్లె - మంత్రార్థ - శంకరభాష్య, భాష్యార్థ సహిత వివరణతో 5-21-125-2/16, బ్రాడీ పేట, గుంటూరు - 1986.

8. ఆంధ్ర జ్యోతి - వార పత్రికలు - విశ్వదర్శనము - సంపాదకులు శ్రీ నండూరి రామ మోహన రావు - 20.9.91, 27.9.91 మఱియు 4.10.1991.

9. శ్రీ ఈశోపనిషత్ - పూజ్యశ్రీ ఎ, సి. భక్తి వేదాంత స్వామి ప్రభుపాదులు - ఆంధ్రానువాదం - డా. దివాకర్ల వేంకటావధాని సంపాదకులు. శ్రీమాన్ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు - శ్రీమతి విజయ సర్వలక్ష్మి 1996.

## ఆంగ్ల రచనలు

1. The Upanishads. Sir Aurobindo. Vol 12 Centenary Edition - August 1972.

2. Isavasya and kena Upanishads
P. Krishna moorty, 5677, st Mary;s Road, Secunderabad - 1973.

3. Sacred Books of the East. Vol I - Editor
Max Muller F - 1981

4. The Principal upanishads
Centenary Edition, Sir S. Radhakrishnan 1989

5. What are Upanishads ?
The Lakshmi Mills Company Limited,
Coimbatore - 641 037.

6. The Himalayas of the Soul

" The Hindu"- Review of the ten Principal Upanishads into English by W.B. Yeats and Sri Purohit Swamy, Rupa & Co New Delhi - 110 002. 5-1-1993.